మద్రాసు రేసులు
1945-46
8-12-45
శనివారము
తిరువాన్కూరు కప్

# ఆంధ్రపత్రిక.

అర్జునప్రాంత్ శిలాజిత్
MITTRA & CO., Limited.
AMRITSAR (Punjab)

316613

The Andhra Patrika, Madras. | Regd. No. 1118. | Vol 32. | TUESDAY. 4th December, 1945. | No. 204. | వెల ఒకఅణా. | Founder : K. Nageswara Rao.


# పర్షియాలో రష్యాకు అనుకూలమైన ప్రభుత్వం?

## అగ్రరాజ్యత్రయ మధ్యవర్తిత్వము

### డెమొక్రాటిక్ లీగ్ వాంఛ

చుంకింగ్, డిసెంబర్ 2: చైనాలో అమెరికా అవలంబిస్తున్న విధానమును బ్రిటిషు కార్మిక ప్రభుత్వము తమ పలుకుబడి వినియోగించి మార్పించవలెనని చైనా మూడో పక్షమైన డెమాక్రటిక్ లీగ్ నేడు కోర్కను చేసినది. "రష్యా, అమెరికా, ఇంగ్లండులు విడివిడిగా జోక్యంచేసుకోటం బదులు అందరూ కలిసి మధ్యవర్తిత్వం స్వీకరిస్తే బాగుంటుంది" అని డెమాక్రాటిక్ లీగు సభ్యుడొకడు తెలియజేశాడు. చైనాలో యెన్నికలు జరపగలిగేవరకు సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవలెనని లీగు ఒత్తిడి చేయుచున్నది. మంచూరియాకు స్వయం పరిపాలన ఇవ్వవలెనని లీగు అభిమతం.

## పాంటుంగ్‌లో యుద్ధం

### కమ్యూనిస్టుల సంసిద్ధత

పాంటుంగ్, డిసెంబర్ 2: పాంటుంగ్ ద్వీపకల్పంలో చైనా ప్రభుత్వసేనలు దిగి దిగడంతోనే శాంతి స్థాపింపబడటం కష్టం.

నేడు కమ్యూనిస్టుల 8-వ సేనకు చెందిన సైనికులు పాంటుంగ్ నగరానికి 30 మైళ్ల దూరంలోఉన్న కొన్ని ప్రదేశాల నాక్రమించుకొన్నారు; వసియన్ రైలుపట్టాలను కూడా కమ్యూనిస్టులు తిరిగి చేజిక్కించుకొన్నారు.

ఇక్కడ అక్టోబరు 1 న దిగిన ఎమెరికా 6 వ దళ నావికులు ట్సింగ్‌టావో పట్టును, సమీపంలోఉన్న ఒక విమానాశ్రయం వద్దను స్థావరాల నేర్పరచుకొన్నారు.

నవంబరు 14-వ తారీఖున దిగిన కేంద్ర ప్రభుత్వసేనలు ఇక్కడినుంచి కొలదిదూరం మాత్రమే పురోగమించినవి. ఈప్రదేశంలో వీరికీ కమ్యూనిస్టులకు సంఘర్షణలు జరగలేదు.

చిన్‌వాంగ్‌టావో రేవువద్ద ఎమెరికా నావికులు ప్రస్తుతం రక్షణవ్యాపారంలో పనిచేస్తున్నారు.

2 వ పేజీ చూడుడు

## గవర్నర్ కేసీ మహాత్మునిసంభాషణ

### ఆదివారంనాడు తిరిగి సమావేశమైనారు

### పెద్ద పెద్ద ఆలోచనలు జరుగుతున్నవని ఊహలు

కలకత్తా, డిసెంబరు 2: గాంధీమహాత్ముడున్నూ, బెంగాల్ గవర్నరు ఆర్. జి. కేసీయున్నూ మళ్లీ యీనాడు యంత్రం కలుసుకున్నారు. నిన్నటివేళకే ఇవ్వాళ సాయంత్రం 6.30 కు గాంధీజీ గవర్నమెంటు హౌసుకువచ్చారు. ఆయనవెంట ప్యారీలాలు, సుధీర్ ఘోషు, వచ్చారు.

మహాత్ముడూ, కేసీ గంటన్నరసేపు మాట్లాడుకున్నారు. నిన్న నేడు మొత్తం 185 నిమిషాలు సంభాషణ నడిచింది. నేడు గవర్నరుభార్య మహాత్ముని దర్శనం చేసింది.

రెండు రోజులుగా మూడు గంటల పైచిలుకు సంభాషణ దేన్నిగురించి జరిగిందో తెలియదు. నేటితో సంభాషణలు పూర్తయినవో లేక యింకా జరుగునో అదీ తెలియదు.

ఇంత దీర్ఘ సంభాషణలు జరుగుచున్నందున బెంగాలు రాజకీయ ఖైదీల విషయం సహితంగా సమస్త విషయాలూ మాట్లాడుకొని ఉంటారని అనధికార వర్గాలలో భావిస్తున్నారు.

గాంధీమహాత్ముని నల్లటిరంగు కారులో ముందటు కాంగ్రెసు త్రివర్ణపతాకం యెగురుతూండగా నూరేళ్లనాటి పాత గవర్నమెంటుహౌసు ఉత్తరపు ద్వారంలో 6-25 కు ప్రవేశించింది. ఇవ్వేళ కూడా సంభాషణలు జరుగుతున్నట్లు కొద్దిమందికిమాత్రమే తెలుసును. గాంధీజీ లోనికి పోతుండగా ఒక్క పత్రికా విలేఖరితప్పితే అక్కడెవరూ లేరు.

శుభయుల సంభాషణ ఫలితంగా బెంగాల్ ప్రస్తుత సమస్యలు గొప్పగా పరిష్కారం కాగలవని సోడేపూర్ ఆశ్రమం కాంగ్రెసు బృందాల్లో యీ సాయంత్రం యింతకుముందు అనుకొంటున్నారు.

కేసీతో మంతనమైనతర్వాత గాంధీజీ కారులో విహారానికివెళ్లి మొన్న మొన్నటిదాకా కలకత్తా విశ్వవిద్యాలయ, ఇండియా మెట్రపాలిటను గాను ఉన్న డాక్టరు ఫాస్ వెస్ట్‌కాట్టుగారిని చూచారు. అక్కడినుంచి సోదేపూర్ ఆశ్రమానికి తిరిగి చేరుకున్నారు.

## మహాత్మునికి మోటారు గండం తప్పింది

కలకత్తా, డిసెంబరు 2: గాంధిమహాత్మునికి నిన్న మోటారుగండం తప్పింది. గాంధీజీ కారున్నూ మిలిటరిట్రక్కున్నూ డీకొని గుద్దుకోవలసినవి కాని మిలిటరి డ్రైవరు సమయస్ఫూర్తి వలన ప్రమాదం తప్పింది. మారిగ్రాం రైల్వేస్టేషనునుంచి మహాత్ముడు బౌరక్పూరు ట్రంకురోడ్డుమీదుగా సోదేపూరు ఆశ్రమానికి పోతుండగా యిది జరిగింది. సాధారణంగా యీ రోడ్డుమీద ఎక్కువగా మిలిటరీ కార్లతిప్పే జాస్తిగా ఉంటుంది. సమయానికి మిలిటరి ట్రక్కు తప్పుకుంది.

మహాత్ముడు బసచేస్తున్న సోదపూరుకు కలకత్తానుంచి ప్రత్యేకం అరగంటకొకసారి బస్సు నడుపుతున్నారు. వీరెలు మారినా జనం ఎక్కడికక్కడే గా ఉంటున్నారు.

## టెహరాన్ మేయరుగా సోవియట్ పక్షపాతి

### బ్రిటన్, అమెరికా సూచనలకు రష్యా తిరస్కారం

[యునైటెడ్ ప్రెస్]

లండన్, డిసెంబరు 2: సోవియట్ ప్రభుత్వానికి సౌకర్యాలు ఇవ్వడానికిపర్షియన్ ప్రభుత్వం ఇష్టపడుతున్నట్లు టెహరాన్ వార్తలు తెలియజేస్తున్నవి. ఇదివరలో ప్రవర్తించిన పద్ధతులను వదలివేసి, పర్షియన్ ప్రభుత్వం రష్యాతో రాజీపద్ధతిని అవలంబిస్తుందనడానికి ఒకనిదర్శనం సైతం కనబడుతున్నది.

సోవియట్ అనుకూలవాది అయిన మహమ్మద్ నారిమాన్‌ను ప్రధాని హాకీమి టెహరాన్ మేయర్‌గా నియమించడమే నిదర్శనం. ఇందువల్ల ప్రస్తుత పర్షియన్ మంత్రివర్గంలో ప్రధానమైన మార్పులు రావచ్చు. సోవియట్ ప్రతికూల వాదులంటూ ప్రభుత్వం నుంచితొలగిపోవచ్చు.

బ్రిటను, అమెరికాలు కేవలం రాజకీయ సహాయాన్నిమాత్రమే తమకు ఇవ్వగలవని పర్షియన్ ప్రభుత్వవర్గాలవారు నమ్మి, ఈ కొత్త విధానాన్ని అనుసరించదలచినట్లు.

### రష్యా సమాధానం

వచ్చే జనవరి 1 వ తేదీలోపుగా పర్షియాలోని విదేశీసేనలన్నిటినీ ఉపసంహరించాలని అమెరికా చేసిన యీ చనను నిరాకరిస్తూ రష్యన్ ప్రభుత్వం అమెరికాకు సమాధానం పంపింది. నమ్మదగిన రాజకీయవర్గాల ద్వారా ఈవర్తమానం తనకు తెలుస్తున్నట్లు అమెరికన్ బ్రాడ్‌కాస్టింగ్ (?) ప్రెస్ విలేఖరి వ్రాస్తున్నాడు.

బ్రిటిషువారి లేఖకు కూడా రష్యా ఇదేమాదిరి సమాధానం పంపిందని ఇప్పుడు తెలుస్తున్నది. రష్యనులు తమసేనను ఖాళీచేసినా, చేయకపోయినా, అమెరికామాత్రం తన సేనను పర్షియానుంచి 1946 జనవరి 1వ తేదిలోపుగా ఖాళీచేస్తుందని అంటున్నారు.

ఇరాన్ సరిహద్దులలో కుర్దులు తిరుగుబాటుకు సన్నద్ధులవుతున్నట్లు వర్తమానం తెలిసి ఇరాన్ భయపడుతున్నది. కుర్దులు ఆయుధధారులవుతున్నారట. కుర్దులు, అస్సిరియనులను ఎదురుపారుగువారే.

### మాస్కో రేడియో వ్యాఖ్యాత వివరణ

లండన్, డిసెంబరు 2: పర్షియన్ ప్రభుత్వానికి రష్యాపంపిన లేఖద్వారా ఉత్తర పర్షియాలో రష్యన్ పరిస్థితి స్పష్టపడిందని మాస్కో రేడియో వ్యాఖ్యాత బోక్‌మన్ ప్రకటిస్తున్నాడు.

ఇలాగు ఇంకా ఈ విధంగా కూడా తెలియజేస్తున్నాడు.

"పర్షియా అంతరంగిక వ్యవహారాలలోగాని, రాజకీయ సమస్యలలోగాని సోవియటు సాయుధ దళాలు ఇదివరకెన్నడూ జోక్యం కలిగించుకోలేదు; ఇక ముందున్నదూ కలిగించుకోవు. 1942 లో బ్రిటన్, రష్యా, అమెరికాలమధ్య జరిగిన త్రైరాజ్య ఒడంబడికే మరతలను రష్యా తు. చ. తప్పకుండా పాటిస్తూనే వచ్చింది. ఐతే పర్షియాయే అందుకు భిన్నంగా ప్రవర్తించింది. ఉత్తరపర్షియాలో ప్రారంభమైన జాతీయ ప్రజాస్వామ్య ఉద్యమం కేవలం పర్షియా అంతరంగిక సమస్య అనే సోవియెటు యూనియన్ అభిప్రాయం. ఆఉద్యమంతో ఆప్రాంతంలోని సోవియట్ ప్రతినిధులకుగాని, సేనాధిపతులకుగాని ఏవిధమైన సంబంధమూలేదు. పర్షియాయేల రష్యా కనబరుస్తున్న స్నేహభావ సరిని పర్షియనేల్ వృద్ధి నిరోధక వర్గాలవారు బుద్ధిపూర్వకంగా అప్పసుగా ప్రకటిస్తున్నారు."

## సుభాసబోస్

### జపానువారి గౌరవము

(ఓరియంటల్ ప్రెస్)

లక్నో, డిసెంబరు 2: జపానులో జనరల్ టోజో అధ్వర్యము వహించిన రోజులలో జపానీయులు చాలామంది ఆజాద్ హింద్ గవర్నమెంటు అధిపతి సుభాసచంద్రబోసుతో "తమవంటి నాయకుడు మాకు ఉంటే మా స్థితి ఇంకొకవిధముగా ఉండేది" అనే వారని రెండు ప్రభుత్వాలతో సంబంధము ఉన్న అనధికారులు తెలియజేసినారు.

## కలకత్తాలో సంభవించే కాకతాళీయం

### దేశనాయకులకూ వైస్రాయికీ లభించే అవకాశం

### స్టేట్స్‌మన్ పత్రిక హితవు

కలకత్తా, డిసెంబరు 2: కలకత్తాలో పరిష్కారం దగ్గిర పడేయోపల సద్భావం ముమ్మరించుటకు వచ్చునంటూ స్టేట్స్‌మన్ పత్రిక నేటి సంపాదకీయంలో యిలా వ్రాసింది.

"కలకత్తాలో యీ వారం కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డున్నూ, కార్యసంఘమున్నూ సమావేశమౌతున్నవి. మరి నాలుగైదు రోజుల్లో వైస్రాయి వస్తున్నారు. ఒకదానిమీద ఒకటిగా యివన్నీ ఒకసారి రావడంవలన అవకాశం ఒకటి యేర్పడుతున్నది. యీ సావకాశం వినియోగపడుతుందని విశ్వసిస్తున్నాము. ఏకకాలమందున ఇందరు ప్రసిద్ధులైన దేశనాయకులూ, వైస్రాయీ కలకత్తాకు రావడం కాకతాళీయమే అయినపక్షంలో అలా కాకతాళీయమే అయినప్పటికీ దాన్నుంచి లాభం పొందవలసిఉంది. ఇటీవల కలకత్తాలో జరిగిన తీవ్రమైన సంఘర్షణలను బట్టి తెలివిగా పర్దుబాటు చేయవలసిన అవసరం హెచ్చుతున్నది. పెద్దగాతోస్తున్న బెంగాల్ రాష్ట్రపు జటిల ప్రశ్నలు భారతదేశపు అవసరాలకు మచ్చుగా ఉన్నవి. గుణపాఠం నేర్చుకోవలసిఉంది. కనుక కలకత్తాలో పరిష్కారం దగ్గిరపడే రోజుల సద్భావం ముమ్మరించునుకోవచ్చును.

## డిసెం. 10 న గాంధీ వైస్రాయిసమావేశమా?

### కలకత్తా రాజకీయవేత్తల ఊహ

కలకత్తా, డిసెంబరు 2: గాంధిమహాత్ముడును వైస్రాయి వేవెలున్ను డిసెంబరు 10 న కలకత్తాలో సమావేశమై మాట్లాడుకోవచ్చునని వేత్తలయినవారివల్ల తెలుస్తున్నట్లు యీ ఉదయం హిందూస్థాన్ స్టాండర్డుపత్రికలో వ్రాయబడింది.

బెంగాలుగవర్నరుకూ గాంధీజీకీ జరిగిన సంభాషణలు ముఖ్యమైనవని రాజకీయ బృందాల్లో భావిస్తున్నారు. 1942 ఆగస్టులో మిదన్నపూరులో జరిగిన సంఘటనలు రాజకీయ ఖైదీల విముదల మొదలైన బెంగాల్ విషయాలు నానా మాట్లాడుకున్నట్లు తెలుస్తున్నది. ఈ మంతనాల వలన భారత సమస్యకు సంబంధించిన ముఖ్య విషయ వివేచనకు ఆధార మేర్పడి వచ్చునని విశ్వసిస్తున్నారు. ఈ సందర్భంలో క్రిస్మసు పండగకు ముందు గాంధీ-వైస్రాయి సమావేశం జరగవచ్చుననే ఊహను రాజకీయ వేత్తలు ఉపేక్షించటంలేదు. అంతా సవ్యంగా జరిగితే ఆపైన ఇండియా సెక్రటరీతో, గాని అండర్ సెక్రటరీతో గాని మంతనం జరగవచ్చునని హిందూస్థాన్ స్టాండర్డు రిపోర్టువల్ల తెలుస్తున్నది.

## ఆ. హిం. ఫౌజు రెండోముద్దాయి

### బరహనుద్దీన్ చిత్రాల్ మెహతరు సోదరుడు

జూరిస్ డిక్షన్ పేచీ

లాల్‌ఖిల్లా న్యూఢిల్లీ డిసెంబరు 3: బ్రిగేడియర్ కరియప్ప అధ్యక్షతను కోర్టు మార్షల్ వారి ఎదట ఈరోజున కెప్టెన్ బర్హానుద్దీన్ విచారణ ఆరంభముఅయింది ముద్దాయి చేసిన నేరాలు సింగపూరులోనూ సాటగాలోనూ మలయాదేశములోనూ ఇంకా యితరచోట్లనూ రంగూన్‌లోనూ పింమకలాలోనూ బర్మాదేశములో ఇంకా ఇతరచోట్లనూ 1942 మొదలు 1945 వరకున్నూ సార్వభౌమునిమీద యుద్ధము సాగించినాడు రంగూన్‌లో 1944 వ సంవత్సరములో ఫిబ్రవరి 5 వ తేది ప్రాంతాల లో జోధాసింగును చంపేట్లు చేసినాడు.

డిఫెన్సు ప్రధాన లాయరు భూలాభాయి దేశాయి ఈ విచారణకు జూరిస్‌డిక్షన్ అభ్యంతరము చెప్పినాడు. ముద్దాయి చిత్రాల్ సంస్థాన మెహతర్ సోదరుడు అనిన్నీ ముద్దాయి మీద ఆరోపించిన నేరాలన్నీ బ్రిటీషు ఇండియాలో జరిగినవికావు అనిన్నీ ఈ నేరాలకు ముద్దాయిని విచారించడానికి ఈ కోర్టువారికి హక్కులేదనిన్నీ భూలాభాయి దేశాయి వాదము

(చిత్రాల్ సంస్థానము పశ్చిమోత్తర రాష్ట్రమునకు సంబంధించినది. సంస్థానాధిపతిని మెహతర్ అని వ్యవహరిస్తారు.)

ముద్దాయి చిత్రాల్ మెహతర్ సోదరుడు అవునా కాదా అనే సందేహము ప్రాసిక్యూషన్‌వారికి వచ్చింది. ఆ విషయము తరువాత చూడవచ్చుననీ ముందుకోర్టు జూరిస్‌డిక్షన్ విషయము ఆలోచించవలసిందని అడ్వొకేటు జనరలు చెప్పినాడు.

భూలాభాయి దేశాయి వాదము.

### గవర్నరు హత్య

టెహరాన్, డిసెంబరు 2: టాబ్రిజ్‌కు దక్షిణంగా 50 మైళ్లలోవున్న మరాఘే అనే పట్టణంలో గవర్నరును తిరుగుబాటుదార్లు తుపాకులతో కాల్చిచంపినట్లు టెహరాన్ పత్రిక ప్రకటిస్తున్నది.

### మౌలానా అజద్ ఆగమనం

కలకత్తా డిసెంబరు 3 - కాంగ్రెసు మహాసభాధ్యక్షులు మౌలానాఆజద్ గారు నేటిఉదయము 11 గంటలకు విమానములో యిచ్చటికి విచ్చేసిరి.

## ఎన్నికల అనంతరం బ్రిటిష్‌వారి కర్తవ్యం

### అది జరగనిపక్షంలో "ఇతరులే" చొరవజేసిచేస్తారు

### జవహర్లాల్ నెహ్రూ ముందుచూపు

న్యూఢిల్లీ డిసెంబరు 2: ఎన్నికలు కాగానే రాజ్యాంగ పరిషత్తు స్థాపనకై బ్రిటిషువారు గబగబా పనిచేయవలసి ఉంటుంది వారలా చేయనిపక్షంలో "యితరులే" చొరవజేసిచేస్తారని పండిత నెహ్రూ యిక్కడ పత్రికలవారితో ముచ్చటిస్తూ చెప్పి అలహాబాదు వెళ్ళిపోయాడు. ఎన్నికలయేవరకూ రాజకీయంగా గమనింతి పెద్దసంగతులు జరుగవకపోవచ్చును. ఎన్నికలైన తరువాత ఎన్నికలలో పట్టునైన విధంగా దేశంలోని ప్రజాభిమత ప్రతినిధులతో గూడిన ప్రభుత్వాన్ని కేంద్రంలో స్థాపింపవలసి ఉంటుంది. ఆ పైన నేతాజీ ప్రకారం ప్రభుత్వ స్థాపనచేసే రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటుచేయవలసి ఉంటుందని నెహ్రూ చెప్పాడు. అయితే సంపూర్ణంగా స్వతంత్రమైన ప్రభుత్వం వెంటనే వస్తుందా అన్న విషయమాయన చెప్పలేదు. కాని త్వరలో పనికి పూనుకోవాలన్నది నెహ్రూ ఇంగితము. బ్రిటిషువారు అలాచేయక పోతే తగినతరులు చొరవజేయవలసి ఉంటుంది.

దేశంలో ఆ. హిం. ఫౌజు విషయమై కలిగిన అభిప్రాయ ప్రకారమేమని అడుగుచున్న సవిస్తరంగా ప్రశ్నించగా నెహ్రూ తన భావాలు సాకల్యంగా తెలిపాడు.

ఆ. హిం. ఫౌజు గాథనల్లనూ యిప్పటి విచారణవల్లనూ సైన్యం ప్రజలకు సన్నిహితమైనది. యుద్ధకాలంలో విశాల పద్ధతిని సైనికులను చేర్చుకోవడం కూడా యిందుకు తోడ్పడింది. ఒకప్పుడు సైన్యం తమకు పరాయిది, పరాయిదీ కూడా నడుకున్న ప్రజలకు యిప్పుడు

(2 వ పేజీ చూడుడు)

## నాయకత్రయసభ అమెరికాలో?

### మార్షల్ స్టాలిన్ త్వరలో మాస్కో రానున్నాడు

### సోవియట్‌రష్యాఅంతటా ఆయన పర్యటనంచేయవచ్చు

మాస్కో, డిసెంబరు 2: నల్లసముద్ర తీరంలోని సోచీ అనే పట్నంలో విశ్రాంతి తీసుకుంటున్న మార్షల్ స్టాలిన్ అనతికాలంలోనే మాస్కోకు తిరిగి రాబోతున్నట్లు తెలుస్తున్నదని రాయిటర్ ప్రత్యేక విలేఖరి వ్రాస్తున్నాడు.

యుద్ధసమయంలో విశేషశ్రమపడి పని చేసినందువల్ల కలిగిన బడలిక ఈ దీర్ఘ విశ్రాంతి వల్ల తీరిపోయింది. క్రెమ్లిన్ భవనానికి తిరిగివచ్చి, తర్వాత మార్షల్ స్టాలిన్ తన జీవితంలో నూతనాధ్యాయాన్ని ప్రారంభిస్తాడనిఊహా వివరిస్తున్నది.

యుద్ధానంతర పరిస్థితులలో సోవియటు రష్యాపై స్టాలిన్ ఏవిధంగా నాయకత్వం వహిస్తాడనే విషయాన్ని గురించి అనేక వార్తలు ప్రచారమవుతున్నవి. 1946 ప్రారంభంలో స్టాలిన్ నాయకత్రయ సమావేశానికి హాజరుకావచ్చునన్నది. ఈవార్తలలో ఒకటి. ఐతే ఈ వర్తమానం ఏమాత్రం ధ్రువపడలేదు. నాయకత్రయ సమావేశానికి తొలి ఏర్పాట్లు జరుగుచున్నవని చైనాం మరికొన్ని వార్తలు తెలుపుతున్నవి. కాని, మాస్కోలోని బ్రిటిష్, అమెరికన్ రాయబార కార్యాలయాలు మాత్రం ఈ విషయమై ఏవిధమైన వ్యాఖ్యానాన్ని చేయటం లేదు.

సోవియట్ విదేశ కార్యాలయం మాటలు మౌనభావాన్నే కనబరుస్తున్నది. పోట్స్‌డాం సమావేశంనుంచి తిరిగిపోతూ ప్రెసిడెంటు ట్రూమన్, నాయకత్రయ సమావేశం అమెరికాలో జరిగే పక్షంలో హాజరయేవిషయమై ఆలోచిస్తానని జనరలిస్సిమోస్టాలిను అన్నట్లు ప్రకటించాడు. నాయకత్రయ సమావేశం ఈ సారి అమెరికాలో జరగవచ్చుననడానికి బహుశా ట్రూమన్ ఆ నాడు చేసిన ప్రకటనే ఆధారమై వుంటుంది.

### మొలటోవ్ ప్రధాని?

రష్యన్ వ్యవహారాలతో సన్నిహిత సంబంధం వున్న వర్గాలద్వారా ఇండియన్ యునైటెడ్ ప్రెస్ రాజకీయ విలేఖరి ఈ కింది విషయాన్ని తెలుసుకోగలిగాడు:

మార్షల్ స్టాలిన్ మాస్కోకు తిరిగి రాగానే చేసే పనులలో మొదటిది విదేశాంగమంత్రి మొలటోవ్‌కు ప్రధానమంత్రి పదవిని కట్టబెట్టటం. ప్రధానమంత్రి హోదాలో మొలటోవ్, పీపుల్సు కమిసార్ కౌన్సిలుకు అధ్యక్షుడు కూడా అవుతాడు. 1941 మే నెలవరకూ మొలటోవ్ ఈ పదవిలో పనిచేసినాడు. జర్మనీ యుద్ధ సన్నాహ ప్రారంభించగానే, స్టాలిన్ స్వీకరించాడు.

విశ్రాంతినుంచి తిరిగి వచ్చిన తర్వాత స్టాలిను సోవియెటురష్యా అంతటా పర్యటనం చేయవచ్చు. సోవియెటు ప్రజలు తమ నాయకునిగా ఆవిధంగా చూడగలుగుతారు.

## పోలీసుకాల్పులవలన ఒరిగిందేమీలేదు

### నిష్పాక్షికమైన బహిరంగవిచారణ అవసరము

### బ్రిటిషమెరికన్ చైనా సైనికుల సాదరలేఖ

కలకత్తా, డిసెంబరు 2: ఇటీవల కలకత్తాలో జరిగిన పోలీసు కాల్పులనుగురించి సంపూర్ణంగానూ, నిష్పాక్షికంగానూ బహిరంగమైన విచారణ జరగవలెననిన్నీ, జవాబుదారీ గలవారు తప్పిదం చేసినట్లు తేలితే దండించవలెననిన్నీ నేటి స్టేట్స్‌మన్ పత్రికలో బ్రిటిష అమెరికన్ చైనా మిత్రరాజ్య సైనికులు కొందరు కలిసి ప్రచురించిన లేఖలో తమ అభిలాషను వ్యక్తంచేశారు. కాల్పుల అనంతరం జరిగిన హింసాకాండలో యిలాంటి ప్రమేయమూ లేనట్టి విద్యార్థులను అరెస్టుచేసి నిర్బంధించి ఉంచివేయటం న్యాయమైన ప్రజాధర్మాన్ని భంగించడమేకాక, భారత ప్రజలతోటి సౌమనస్య సామరస్యాలకు భంగం అవుతుందంటూ యీ లేఖకులు యిలా తెలిపారు.

"ప్రజలు హావభావాలను వెలిబుచ్చుకునేటి యీ బహిరంగపు సంరక్షింపు అర్హతలను మంజూరుచేసే స్వాతంత్ర్యం నూ శోధించాలి;- నవంబరు 21-23 తేదీల సంఘటనలు, యిలాంటి కట్టుబాటు లేని పరిస్థితులు ముందు ముందు మళ్ళీ సంభ

2 వ పేజీ చూడుడు

# డిటెన్యూలుగా నుండినవారికి వోటు లేకుండ చేయరాదు
## శ్రీ ప్రకాశంగారి హెచ్చరిక

మద్రాస్, డిసెంబరు 2: 'ఒక ఇంటిలో 120 రోజులు నివసింపలేదను కారణమున డిటెన్యూలుగా నుండిన వారిపేర్లను వోటర్ల పట్టికలనుండి మినహాయించుట యెంతమాత్రము సమర్థనీయము కాదు. రాష్ట్రీయ ప్రభుత్వమువారు జారీచేసిరని చెప్పబడుచున్న రహస్య ప్రకటన పత్రము నాధారముచేసికొని యిట్టి మినహాయింపు గావింపబడిన యెడల నది మరింత హేయమనుచున్నది అని చెప్పుచు ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు శ్రీ ప్రకాశంగారు ఈక్రింది ప్రకటన గావించుచున్నారు: "చెరసాలగృహము కొకపోవుటచేత డిటెయిను గావింపబడిన వ్యక్తి విడుదలయైన తరువాత దానిలోనికి తిరిగివెళ్ళ నుద్దేశింపడని కొందరు గావించు వ్యాఖ్యానము సరియైనది కాదు. యెందుకనగా తిరిగి ఆతడు చెరసాలలోనికి వెళ్ల నుద్దేశించుచున్నాడా అను విషయమునుబట్టి దీనిని నిర్ధారణ చేయరాదు. తన స్వస్థలమునకు, అది యెచ్చట నున్ననుసరే, తిరిగి వెళ్ళ నుద్దేశించుచున్నాడా యను విషయమునుబట్టి నిర్ధారణ చేయవలెను. ఇండియా ప్రభుత్వ చట్టములో, ఈ విషయమునకు సంబంధించిన నిబంధన 'అనిమస్ రివర్టెండి' సిద్ధాంతముపై ఆధారపడియున్నది. ఒకానొక వ్యక్తి తన యిష్టమునకు వ్యతిరేకముగా నిర్బంధింపబడి యున్నంతకాలము తన్నొక చెరసాలలో నిర్బంధించి నప్పటికి, ఆగాఖాను భవనములో నిర్బంధించినప్పటికి, అహమ్మద్‌నగర్ కోటలో నిర్బంధించినప్పటికి తన స్వస్థలమునకే వెళ్ల నుద్దేశించుచుండును. ఇంగ్లండులోను, భారతదేశములోను ఈ విషయమునకు సంబంధించిన 'కేస్ లా' బోలెడంతకలదు. ఇట్టి పరిస్థితులలో మద్రాసు ప్రభుత్వమువారు తమపొరబాటును దిద్దుకొన్న బాగుండెడిది.

భారతదేశములో ఈ సమస్య మధ్యరాష్ట్రములలో సేట్ గోవిందదాస్‌గారి కేసు సందర్భమున నుత్పన్నమయ్యెను. ఆంగ్ల న్యాయశాస్త్ర సిద్ధాంతమును సరిగా వర్తింపజేసి ఈ విషయమును నాగపూరు హైకోర్టువారు నిర్ధారణచేసిరి. మరేరాష్ట్రములోను ఈ సమస్య యింత ఉద్ధృతంగా ఉత్పన్నము కాలేదు. బొంబాయి ప్రభుత్వము వారు యిందువిషయమై అవలంబించిన వైఖరి సక్రమమైనదిగను, న్యాయమైనదిగాను వున్నది. బొంబాయి ప్రభుత్వము వారి అభిప్రాయము ననుసరించి 1941 సం॥రపు వోటర్ల జాబితానుండి పేరలుతీసివేసి పట్టికలను సవరింప వీలులేదు. ఈ సమస్యలో యిది ప్రధానవిషయము. ప్రస్తుత సవరణలకు 1941 సం॥పు పట్టిక ఆధారభూతమైనదగుటచే బ్రదికి యున్నవారి పేర్లను దానినుండి తొలగించుటకు రెజిస్ట్రారుకిని అధికారములేదు. సవరణల పట్టికను తయారుచేయుట మాత్రమే తమ ఉద్దేశ్యముగాని పట్టికలను క్రమపద్ధతిలో మార్చుట తమ ఉద్దేశ్యము కాదని మద్రాసు ప్రభుత్వమువారు సెప్టెంబరు 28 తేదీని గావించిన ప్రకటనలో తెలిపియుండిరి. తమ పేర్లు చేర్చవలసినదని కొందరు డిటెన్యూలు దరఖాస్తులు పెట్టినంతమాత్రమున స్థితిగతు లెంతమాత్రమును మారజాలవు. ముందు జాగ్రత్త విశేషముగా నుండుటవసరమను ఉద్దేశ్యముతో వారు దరఖాస్తులు పెట్టిరని తలపవలెను. ప్రస్తుత పట్టికలనుండి వారిపేర్లను యెంతమాత్రము తొలగింప వీలులేదు. స్వస్థలమునకు తిరిగి వెళ్లు ఉద్దేశ్యమునకు సంబంధించిన సిద్ధాంతమునకు విపరీతార్థము కల్పించుటవల్ల ఈ వ్యవహారమంతయు అస్తవ్యస్తమైనది.

ప్రజలు తమ వోటింగు అధికారమును చలాయించు హక్కు ప్రజాసత్తాక ప్రభుత్వమునకును, స్వపరిపాలనమునకును సారభూతమై యున్నది. ఈ హక్కును మదరాసు ప్రభుత్వమువారు చేసినట్లు చులకన చేయరాదు. మద్రాసు ప్రభుత్వమువారు తమ పొరబాటును సవరించుకొందురని ఆశించుచున్నాను.' (యు. ప్రె)

# అనర్హత తొలగింపవలసినదని తాఖీదులు

లాహోరు, డిసెంబరు 2: రాబోవు యెన్నికల సందర్భమున ఇండియా ప్రభుత్వమువారు రాష్ట్రీయ ప్రభుత్వములకు ఒక తాఖీదు పంపిరి. నామినేషను కాగితములు దాఖలుచేయుటకును అనుబంధ వోటర్ల జాబితా ప్రచురణమునకును మధ్య వ్యవధి చాల తక్కువగా నుండుటవల్ల కొందరికి యేర్పడనున్న అనర్హతను తొలగించవలెనని దానిలో వారు సూచించినట్లు తెలియుచున్నది. యెన్నికల విషయమై అవలంబించు విధానమును ఉదారమైనదానినిగా చేయవలెననికూడ వారు సూచించిరి. రాజకీయ నేరములకు రెండు సంవత్సరములు శిక్షపడినవారు యెన్నికకు నిలువరాదను నిబంధనవల్ల కొంతమందికి యేర్పడిన ప్రతిబంధకము తొలగ

# ఆజాద్ హింద్ ఫౌజు విచారణలు ఆపివేయవలెను
## శరత్‌బోసు ప్రకటనము

కలకత్తా, డిసెంబరు 2: ఆజాద్ హింద్ ఫౌజువిషయములో ఇండియా గవర్నమెంటువారి ప్రకటనను గురించి శరత్ చంద్రబోసు యీ విధముగా తన అభిప్రాయాన్ని వెల్లడించినాడు.

"గవర్నమెంటువారు ప్రజాభిప్రాయాన్ని మన్నించేట్లుగా ఉంది. అయితే ఇరవైమొదలు యాభైమంది వరకున్నూ విచారణ చేయడానికి గవర్నమెంటువారు నిశ్చయించడము భారతదేశ ప్రజాభిప్రాయము ప్రకారము దయ చూపించడము కాదు. ఆ. హిం. ఫౌజువారి తలమీద ఒక వెంట్రుకయినా కదిలించరాదనేది హిందూ ప్రజాభిప్రాయము. సెప్టెంబరు మాసములో బొంబాయి విక్టోరియా టర్మినస్ ప్రాంతములో ఉపన్యసిస్తూ నేను ఈ విషయము చెప్పినాను. ఈ ఆ. హిం. ఫౌజువారందరున్నూ క్రూరముగా ప్రవర్తించినారని యే సాక్ష్యమువీద వీరిని ఇండియా గవర్నమెంటువారు ఖాయిదుచేసినారో నాకు తెలియదు. యుద్ధ సమయములో క్రూరకృత్యములు ఉంటూనే ఉంటవి, సివిలియన్ జనాభామీద ఆటంబాంబులు ప్రయోగించినవారు ఈనాడు క్రూరకృత్యాలను గురించి మాట్లాడుతున్నారు. ఆజాద్ హింద్ ఫౌజువారు పాశ్చాత్య సామ్రాజ్యపద్ధతులను పాటించినారా లేదా అనేదే నాకు తెలిసినవిషయము. అట్లా అయినప్పటికిన్నీ ఆజాద్ హింద్ ఫౌజువారు క్రూరకృత్యాలు చేసినారని నమ్మడము చాలాకష్టము. అసంభవము కూడాను, నా దేశస్థులను గురించి నాకు బాగా తెలుసును. అందులో స్వాతంత్ర్యము కోసము పోరాడే భారతీయులు క్రూరకృత్యాలు చేయరని నేను ఘట్టిగా చెప్పగలను. ఈ విషయము ఇండియా గవర్నమెంటువారు బాగా యోజించి ఇంత ఆలస్యము అయినప్పటికిన్నీ ఆజాద్ హింద్ ఫౌజువారిని విచారణకు పెట్టకుండా వదలివేయడము ఉచితము.

# విద్యార్థులకు రాష్ట్రపతి హితబోధ

అలహాబాదు, డిసెంబరు 2: రాష్ట్రపతి అబుల్‌కలాం ఆజాద్ వింధ్యాచలం నుంచి నేడు వచ్చారు. పండిత నెహ్రూతో ఆనందభవనంలో విడిదిచేశారు. ఈమధ్యాహ్నం ఆజాద్‌గారు అమృతబజారుపత్రిక కార్యాలయం చూచినప్పుడు అక్కడి పత్రికవారు సత్కారం చేశారు. అనంతరం ఆనందభవనంలో నాయకులిద్దరూ కలకత్తాలో తర్కించబోయే ముఖ్య విషయాలనుగూర్చి రెండుగంటలసేపు మాట్లాడుకున్నారని తెలుస్తున్నది. ఆనందభవనం మేడమీదనుంచి విద్యార్థి సమూహానికి ఉపన్యసిస్తూ రాష్ట్రపతి వారి ఉత్సాహవేశాలను మెచ్చుకొని ముందు ముందు కాంగ్రెసు పిలచినప్పటికి బలశక్తులన్నీ దట్టించుకోవలసిందని హితవు చెప్పారు.

# కాంగ్రెస్ సమావేశాలు
## 6 న కార్యసంఘం
### పార్లమెంటరీబోర్డు 4 న

కలకత్తా, డిసెంబరు 2: కాంగ్రెసు కార్యసంఘం ఆరోతారీఖు మధ్యాహ్నం సమావేశమౌతుంది. రాష్ట్రపతి వచ్చిన తరువాతనే సమావేశం ఆయనయింట్లో జరిగేది లేక మరెక్కడైనా జరిగేది నిశ్చయమౌతుంది. ఎన్నికప్రణాళిక ఆలోచించడము, ఆహిం ఫౌజు సమితిని ఏర్పరచడము, ప్రస్తుత రాజకీయ పరిస్థితిని విచారించడము అనేది సభా కార్యక్రమంగా ఉంటుందని కాంగ్రెసు ప్రధానకార్యదర్శి కృపలానీగారు పత్రికలవారితో చెప్పారు. సభ మూడురోజులపాటు జరుగుతుంది. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు సమావేశకర్త వల్లభాయి పటేలున్నూ, బోర్డు అధ్యక్షుడు రాష్ట్రపతి ఆజాదున్నూ రేపు వస్తారు. పార్లమెంటరీబోర్డు నాలుగవ తేదీ మధ్యాహ్నం సమావేశమౌతుంది. సభ్యులు, రాష్ట్రకాంగ్రెసు ప్రముఖులు ఒకొక్కరే వస్తున్నారు.

# 59 మంది ప్రముఖ జపాను నాయకుల ఎరెస్టు

టోకియో, డిసెంబరు 3: రాయిటర్ విశేషవిలేఖరి జాక్‌స్మిత్ ఇలా వ్రాస్తున్నాడు:-

యుద్ధనేరస్థులుగా అనుమానితులైన 59 మంది ప్రముఖ జపాను నాయకులను ఎరెస్టు చేయవలసినదిగా సేనాధిపతి జనరల్ డొగ్లాస్ మెకార్థర్ ఉత్తరువులు జారీ చేశాడు.

---

వచ్చును పెటెల్ ప్రభువు ప్రకటన ననుసరించి వోటర్ల పట్టికలలో గావింపబడుచున్న మార్పులవల్ల వోటర్లసంఖ్య చాల హెచ్చును. 1935 సం॥లో 100 కి 14 వంతులుమాత్రము వోటర్లుగా నుండిరి. ఇప్పుడు వారిసంఖ్య 100 కి 20 వంతులగునని అనుకొనుచున్నారు.

# కొచిన్‌చైనాలో ఫ్రెంచి విజయం
## ఇండోచైనా పరిస్థితి

సైగాన్, డిసెంబరు 2: కొచిన్‌చైనాలో (ఇండోచైనా) రాకపోక సౌకర్యాలకు ప్రధాన కేంద్రస్థానమైన బన్మథోట్ అనే పట్టణాన్ని ఒక ఫ్రెంచి దళం శనివారంనాడు పట్టుకున్నదని అమెరికన్ అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరి ఛార్లెస్ గ్రూమిచ్ తెలియజేస్తున్నాడు.

టాంకిన్ రాష్ట్రంలో అన్నామిస్ వర్గాలమధ్య జరిగిన కొత్త సంఘర్షణల ఫలితంగా అసలే చిక్కులతో కూడివున్న ఇండోచైనా సమస్య మరీ జటిలంగా పరిణమించింది. ఇండోచైనా జాతీయపక్షమైన వీట్‌మిన్‌కూ, (దీని నాయకుడు హోచి) డాంగ్‌మిన్ హోయ్ పక్షానికీ (ఇది చైనా జాతీయవాదులతో సంబంధం వున్నది) నవంబరు 12 వ తేదీ తర్వాత మరొక సంఘర్షణ జరిగినట్లు హనాయ్ నుంచి వస్తున్న వార్తలు తెలుపుతున్నవి.

టాంకిన్‌లోని చైనా సేనలు పరిస్థితిని చేయిజారి పోనివ్వడంలేదు; వారు రాజకీయ పక్షాల ఎడల నిష్పక్షపాతవైఖరిని అవలంబిస్తున్నారు.

సైగాన్‌లోని ఫ్రెంచివారు చెలామణిలో నుంచి కొన్ని రకాల కరెన్సీలను తొలగించిన కారణంగా కొత్త సంఘర్షణలు ఏర్పడినవి. ఈ సంఘర్షణలలో పోలీసువారు జోక్యం కలిగించుకున్నారు. 50 మంది మరణించడం గాయపడడం సంభవించింది.

సైగాన్‌కు 120 మైళ్లు ఆగ్నేయంగా వున్న లాంగ్-హూయెన్ అనే పట్టణంలో అన్నామిస్ జాతీయవాదులు ఒక కథలిక్ మిషన్ భవనాన్ని దగ్ధంచేశారు. దానిలో వున్న దిక్కులేని పిల్లలను, మత ప్రచారికలను ఖైదీలుగా పట్టుకున్నారు. అన్నామీస్ ప్రచారికలను వదలివేసి, ఫ్రెంచి ప్రచారికలనే పట్టుకున్నారు.

దిక్కులేని అనామిస్ బాలబాలికలలో చాలామంది పసివారిని సజీవంగా దహనంచేసినట్లు తెలుస్తున్నవి. లాంగ్ హూయెన్‌లో ఆసుపత్రిని కూడా తగుల పెట్టివేశారు.

# బ్రిటన్ ఎమెరికాల ఆర్థిక రాయబారాలు

వాషింగ్టన్, డిశంబరు 2: రాయిటర్ ఇలా తెలియజేస్తున్నాడు:

బ్రిటన్ ఎమెరికాను అడుగుతున్న అప్పువిషయమై రేపు సర్ ఎడ్వర్డ్ బ్రిడ్జెస్, విలియమ్ క్లేటన్‌లమధ్య చర్చలు ప్రారంభమౌతవి. సర్ ఎడ్వర్డ్ బ్రిడ్జెసు బ్రిటిష్ ట్రెజరీకి శాశ్వత కార్యదర్శి; విలియమ్ క్లేటన్ ఎమెరికా ప్రాతినిధ్యానికి నాయకుడు.

సర్ ఎడ్వర్డ్ బ్రిడ్జెస్ లండన్‌నుంచి శనివారంరాత్రి వచ్చాడు; ఎమెరికా కోశ కార్యదర్శియైన ఫ్రెడరిక్ విన్సను అతని సహాయకుడైన హారీవైట్‌ను తదితరులను బ్రిడ్జెసు నేడే కలుసుకుంటాడు. రాయబారాలు నిష్ఫలమయ్యేదీ జయప్రదమయ్యేదీ ఇక కొద్దిరోజుల్లోనే తేలిపోతుంది.

అనవసరమైన విలంబంలేకుండా పని పూర్తిచేసుకొని రావడానికిగాను సూటిగా సర్ ఎడ్వర్డ్ బ్రిడ్జెస్‌నే బ్రిటిషు ప్రభుత్వమువారు పంపియున్నారు. స్టెర్లింగు నిలువల సమస్యగనక సంతృప్తికరంగా పరిష్కారమైతే, అప్పుమొత్తము మొదలైన ఇతర విషయాలు సులువుగానే తేలిపోతవని బ్రిటిషువారి అభిప్రాయము.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 3:

వేరుశెనగ: (531 పౌ. దా. 1-కి ఎక్స్‌పోర్టు గిడ్డంగుల) క్రొత్తరకం మెషిన్‌పప్పు డిట్టో ఆఫీసు మెం 73 12-0 74 0 0 వేరుశెనగనూనె (ఇంగ్లీషు కాండి 500 పౌను గండి) 1-కి ఎక్స్ ... ఎక్స్‌పెల్లర్ ... రు. 185 0-0 ... 1-8 ...

కాయలు (పిలోమరకం)

ఆముదము (మిల్ డెలివరి) ఎక్స్‌పెల్లరు పర్ ఇంగ్లీషు కాండి 500 పౌనులుగలది 195-0-0 ... 50-14-10. 51-9 4.

బంగారు: వెండి: నేటి మధ్యాహ్నం 1 గంటకు ... 1-కి (...) 58-8-0 పెట్టా బంగారు తులం 85 12-0. సిమ వెండి తులము 100-కి (...) 137-0 ... 1 6 6

## నూలుధరలు

మధురమిల్లు:— 20 నెం. బూడిదరంగు (10 పౌ) రూ. 11-5-0. 40 నెం. బూడిదరంగు (5 పౌ) 17-10-0. 60 నెం. బూడిదరంగు (5 పౌ) 18-12-0. 80 నెం. బూడిదరంగు (5పౌ) 24 12-0. కోయంబత్తూరు మిల్లు:- నెం. 20½ ... (10 పౌ) 12-0-6 40 నెం. ... (10 పౌ) 17-10-0. 40 నెం. ... (10పౌ) 17-10-0. 60 నెం. ... (5పౌ) 18-12-0. 60 నెం. ... (5పౌ) 18-12-0. 80 నెం. ఇతర రకాలు (5 పౌ) 24-12-0. 100 నెం. ఇతర రకాలు (5 పౌ.) రూ. 32-4-0

## అదనపు పన్ను

### బళ్లారి కౌన్సిలు తీర్మానం

బళ్ళారి, నవంబరు 29: డి. ఏ. రవూఫ్ (ఛైర్మన్) గారి అధ్యక్షతను నిన్న పుర పాలకసభా వేశం జరిగింది. యుద్ధకాలము నందు విధింపబడిన అదనపు పన్నులు, ఇ. పి. టి; ఇన్కంటాక్సు సర్ ఛార్జీలను వెంటనే తొలగించి, పరిశ్రమలను "నెమ్మది కాలము"లోవలె యథారీతి నడుచునట్లు చేయాలని సర్కారువారిని కోరుతూ తీర్మానించబడింది. కంటోన్మెంటు రైల్వే స్టేషనును మళ్లీ ఉంచాలి. కుడితిని స్టేషనులో గాత్రిపోయే రైలును ఆగేట్టుచేయాలి అని తీర్మానించారు.



# "ఆంధ్రపత్రిక" నిధి

## ఇంతవరకూ వసూళ్లు— రు. 35,882-4-10

## తుపాను బాధితులకు సహాయము చేయండి

గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి విశాఖపట్నం జిల్లాలు తుపానువలన నష్టపడినవి.
ప్రతివారూ తమ శక్తికొద్దీ వెంటనే సహాయము చేయాలి.
తుపాను బాధితుల సహాయనిధిని 'ఆంధ్రపత్రిక' ఏర్పరచినది.
ఈ నిధికివచ్చిన మొత్తములు కేంద్రసంఘమునకు పంపబడును.
విరాళములు పంపువారు "తుపాను బాధితుల సహాయనిధి" అని ఆంధ్రపత్రిక కార్యాలయం, తంబుచెట్టివీధి మద్రాసుకు మనియార్డరుద్వారాగాని చెక్కుద్వారాగాని పంపవచ్చును.

### డిసెంబరు 1-3 వ తేదీ వచ్చిన మొత్తములు:

| | |
|---|---|
| తెనాలి పూర్ణిమా నాట్యమండలి వ్యవస్థాపకులు శ్రీమతి పూర్ణిమగారు బెజవాడలో ఈనెల 1-వ తేదిని 'రాణీప్రమీల' నాటకమును ప్రదర్శించి ప్రథమ దఫాగా ఇచ్చిన విరాళము. (డి. ఎస్. నారాయణ అండు కంపెనీవారి విరాళము నూటపదహార్లు ఈ మొత్తంలో చేర్చబడినది.) | 3,449- 0-0 |
| మద్రాసు ఆంధ్రనాట్యభారతి కార్యదర్శి డాక్టర్ ఎ. రాఘవరావుగారి ద్వారా గత 24 వ తేదీ నాటకప్రదర్శనం వసూలు | 802- 0-0 |
| సింగ్భూమ్ జిల్లా ఈస్టుకోస్టు సైక్లోన్ రిలీఫ్ కమిటీవారు బందరులో అ. భా. చరఖాసంఘ హరిజనుల పాకల నిర్మాణార్థము డా॥ పట్టాభిసీతారామయ్యగారి కివ్వవలసినదిగా పంపినది. | 500- 0-0 |
| పర్లాకిమిడి నివాసులు శ్రీ కోరాడ చంద్రశేఖరరావు బి. ఏ. ద్వారా | 50- 0-0 |
| గుంతకల్లు ఎం. ఎస్. ఎం. ఆర్., డి. టి. యస్. టి. & డి. ఇ. క్లార్కులు | 44-12-0 |
| డిసెంబరు 1-వ తారీఖు యితరవసూళ్లు | 258- 8-0 |
| మొత్తం రు. | 5104-4-0 |
| కేంద్రసంఘకార్యదర్శి సూచనలననుసరించి జిల్లాసంఘాలకు పంపినది | 15300-0-0 |
| మావద్ద నిలవఉన్న మొత్తం | 15,478-0-10 |
| మొత్తం రు. | 35,882-4-10 |

### 3 తా. వరకు వచ్చిన వసూళ్లు 258-8-0 వివరాలు.

శ్రీయుతులు యం. లక్ష్మీనారాయణ శెట్టి మద్రాసు 5, శ్రీ సరస్వతీ స్టోర్సు దేవనకొండ 5, నా. రామయ్య అండ్ బసవయ్య 1, స. నరసప్ప 1, వ. వెంకటస్వామి 1, స. నాగప్పయ్య 1, వ. వెంకట్రామయ్య 1, చి. నాగప్ప 1, సి. చెన్నయ్య 1, మే. నరసింగప్ప 1, బ. నాగప్ప 1, మ. లక్ష్మమ్మ 1, వె. వీరయ్య 1, దేవనకొండ సెంటర్ టీచర్సు సంఘం 3-8, దేవనకొండ పోలీసుస్టేషన్ స్టాఫ్ 2-2, యన్. వెంకట్రాముడు 1, యన్. సోమప్ప 1, పో. నాగిరెడ్డి 1, ఈ తిమ్మప్ప 1, జం. వీరయ్య 1, యల్. గిద్దయ్య ద్వారా చిల్లర మొత్తం 7-6, య. రామమూర్తి 2-8, బి. యస్. నారాయణ 2, ఎ. సి. బిస్వాస్ 2, డి. సూర్యారావు 2, జె. కస్తూరి రంగయ్య 1, యన్. కృష్ణమూర్తి 1, యస్. రామచందర్ 1, యం. ఆర్. మూర్తి ద్వారా యితర వసూళ్లు 3-12, కా. సుబ్బయ్య నంద్యాల 1-8, పి. శ్రీరాములు 2, బి. బాలాజీ సింగు 1, యం. వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి 1, యస్. బాలన్న 2, జే. రామాచారి 1, ఎ. వి. అప్పారావు 1, మిస్టరు అండ్ మిసెస్ జేమ్సు 1, యం. ఆంజనేయులు 1, గోపాలకృష్ణశాస్త్రి 1, ఆర్. వి. హనుమయ్య 1, ఆర్యభవన్ హోటల్ 1, బి. శంకరప్ప 2, ఇతర మొత్తాలు 0-12-0 క. వెంకటరత్నం 10, దా. సామ్రాజ్య లక్ష్మమ్మ 10, జి. యల్లయ్య నంద్యాల 10,

శ్రీ పాగాల బాలప్ప 5, కాశెట్టి రంగప్ప అండు సన్సు 5, వి. సుబ్బారావు 5, కె. పి. నారాయణప్ప శెట్టి అండు బ్రదర్సు 5, వై. హెచ్. సంజీవరావు 3, పి. శ్రీనివాసులు 3, జూటూరు నారప్ప 2, కలివలి వెంకటనారప్ప 2, కోటే రామలింగయ్య శెట్టి 1, మోహన్ అండు కంపెనీ వారు 2, జుజారి నాగప్ప 1.

కోదండ రామవిలాస్ వారు 5, వెంట్రప్రగడ సూర్యప్రకాశరావు 5, మైలవరపు వెంకయ్య 5, కలవా నాగభూషణం 5, మైలవరపు బాపనయ్య 4, పిల్లాకి రుద్రయ్య అండు సన్సు 3. వాసంశెట్టి వీరన్న అండు బ్రదర్సు 3, ఉదయగిరి వీరయ్య 2, శేట. మగ్గాజుల పార్శిమల్లు 2, శేట గాశిరాముబోధి 2, శేట ఓరుమల్లు జాలాజి 2, దేపనశెట్టి సూర్యనారాయణ 2, తోట సూర్యం 2, యిన్నమూరి వెంకయ్య 2, శేట తారాజి కీముచెందు 2, మైలవరపు వెంకయ్య 2, మైలవరపు వెంకటేశ్వర్లు 2, శేట చున్నీలాలు 1, పత్రిశేషాద్రి రావుగార్లు 1.

యన్. శరవణపిళ్లై, త్యాగదుర్గ 4, రాధాకృష్ణ రైస్ అండ్ గ్రౌండ్నట్ మిల్లు వసంతవాడ 10, కో. రెడ్డయ్య గుప్త, చీరాల 5, ప్రెసిడెంట్ రిలీఫ్ రిక్రియేషన్ క్లబ్ 15, రావ్ సాహెబ్ జి. జోగిరాజు గారు 10, యస్. చిన్నదస్తగిరి, జి. సుబ్బన్న 5, దేవరశెట్టి ఆదినారాయణ 3 మండి చెన్నుల పుల్లన్న 1, తిరిపేలరెడ్డి 1 దూదేకుల చెంచన్న 1, భూమిరెడ్డి వెంకటరెడ్డి 1, తొండలదిన్నె అగన్న లు 1, ఉప్పర కొండన్న 1, వడ్లపకర్దీసు 1, నాగముని 1, ఎల్లారెడ్డి 1, టి. నారాయణరావు 1, కొటంవీరన్న 1, ప్యాపలి సుబ్బారాయుడు 1, శీలాసుబ్బన్న 1, పాతకోట సుబ్బారెడ్డి 1, పాతకోట చిన్న సుబ్బారెడ్డి 1, వడ్డ అబ్దుల్ రసూల్ సాబు 1 దూదేకుల చౌసేన్ సాబు 1, కాశీశాస్త్రి సుబ్బన్న 1, దేవరశెట్టి మునయ్య 1.

## తుపాన్ బాధితులకు పూర్ణిమా నాట్యమండలి సహాయం

### బెజవాడలో 'రాణీప్రమీల' నాటకప్రదర్శనం

డా॥ పట్టాభిగారి అధ్యక్షత

బెజవాడ, డిసెంబరు 2: నిన్నరాత్రి శ్రీ దుర్గాకళామందిరంలో తుపానుబాధితుల సహాయార్థమై అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సభ్యులు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతను, తెనాలి శ్రీ పూర్ణిమా నాట్యమండలివారు 'రాణీప్రమీల' నాటకమును ప్రదర్శించారు. 4185 రూపాయల విలువ టిక్కెట్లుఅమ్ముడుపోయాయి. శ్రీ పూర్ణిమా నాట్యమండలి వ్యవస్థాపకురాలు శ్రీమతి పూర్ణిమ ఇంతవరకూ చేతికి అందిన మొత్తమును పంతులుగారికి సమర్పిస్తూ ఇలా చెప్పారు. "అధ్యక్షులవారికి సదస్యులకు నమస్కారము. ఈ నాటకప్రదర్శనమునకు శ్రీ శంభుప్రసాద్గారు అద్దె తీసుకోకుండా దుర్గాకళామందిరము ఇచ్చి మమ్మల్ని ప్రోత్సహించారు. ప్రదర్శనములో పాల్గొంటున్న నటీనటులు డబ్బుతీసుకోవడము లేదు. వల్లపల్లి సంస్థానాధీసులు నూజివీడు లు సౌకర్యాలు ఏర్పాటుచేశారు. వారికి మా కృతజ్ఞత. డి. యస్. నారాయణ అండ్ కంపెనివారు నూటపదహారు ప్రత్యేక విరాళం ఇచ్చారు. వారికి మా వందనాలు. శ్రీ శంభుప్రసాద్ గారికి గురువులు, ఆంధ్రదేశానికి గురుత్వము వహిస్తూన్న శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఈ ప్రదర్శనమునకు అధ్యక్షత వహించుట మా అదృష్టము. పంతులుగారు అధ్యక్షత వహించడంవల్ల తుపాను బాధితులకు మేము చేకూరుద్దామనుకొన్న మొత్తంకంటె అధిక మొత్తాన్ని చేకూర్చ గలుగుతున్నాము.

మేము తలచుకున్న ఈ ఉద్యమానికి అన్ని విధాలా ఈపట్టణపు పౌరముఖ్యులు సహకారం చేశారు. వారందరికీ మా కృతజ్ఞతా పూర్వక వందనాలు,

తుపాను బాధితులకు సహాయార్థము 'ఆంధ్రపత్రిక' ద్వారా నిధిని ఏర్పాటు చేసి, విశ్వదాత కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు జీవించియుంటెని కొరతతీర్చారు శ్రీ శంభుప్రసాద్ గారు.

ఈక్షణంవరకు వసూలైన మొత్తం రు. 3449-0-0. ఇంకనూ వసూలు కావలసిన మొత్తం రు. 736-0-0, మొత్తం రు. 4185-0-0. ఈ మొత్తములో సగము బెజవాడ పట్టణములోని తుపాను బాధితులకు ఇప్పించవలసినదని అధ్యక్షులవారిని ప్రార్థిస్తూ, ఆంధ్రపత్రికాధిపతులు శ్రీ శంభుప్రసాద్ గారికి దీవెనలతో ఇమ్మని అధ్యక్షులవారికి అందచేస్తున్నాను. శ్రీ శంభుప్రసాద్ గారు, అధ్యక్షులవారు వెయ్యికాలాలు పాటు వర్ధిల్లాలని మా యిలవేల్పులకు మొక్కుకుంటాము."

శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు శ్రీమతి పూర్ణిమ ఇచ్చిన విరాళమును స్వీకరిస్తూ ఇలా అన్నారు—"యాభై సంవత్సరములైంది నేను నాటకం చూచి. ఈనాడు కొందరి మిత్రుల ప్రోత్సాహంవల్ల, నేనధ్యక్షత వహిస్తే ద్రవ్యార్జనచేయగలం అంటే, నేనాత్మవంచన చేసుకొని వచ్చాను. నేనధ్యక్షత వహించడంవల్ల ఇంతద్రవ్యం రాలేదు, బహుశా నావల్లే తగ్గిందేమోకూడాను. కేవలం శ్రీపూర్ణిమా నాట్యమండలివారి కళాకౌశల్యం వల్లనే యింత ద్రవ్యం వచ్చింది. ఇక్కడికి వచ్చినందులకు నేను సందేహించను, నేను వగవను. వారు శంభుప్రసాద్కి, ఇతరులకూ కృతజ్ఞులమని చెప్పారు. శంభుప్రసాదూ నాట్యమండలివారూ అంతా మనసంఘంలోనివారే కాబట్టి ఒకరికొకరు ఇలా సహాయం చేసుకోటం సహజం – యెవరికీ కృతజ్ఞత అవసరం లేదు."

శ్రీ చల్లపల్లి రాజావారు స్వయముగా రాజాలనందున ఇట్టి మహత్కార్యము చేసిన శ్రీమతి పూర్ణిమకు ఒక రజతపాత్రను బహుమానం పంపారు. శ్రీ రాజాగారి తరఫున పట్టాభి సీతారామయ్య పంతులుగారు శ్రీమతి పూర్ణిమకు శ్రీ రాజాగారు పంపిన రజతపాత్రను బహూకరించారు.

శ్రీ పూర్ణిమా నాట్యమండలి వ్యవస్థాపకురాలు శ్రీమతి పూర్ణిమ. తుపాను బాధితులయెడ సానుభూతితో, వారి సహాయార్థమై తన నాట్యమండలి ప్రదర్శించిన 'రాణీ ప్రమీల' నాటకంలో 'ప్రమీల' భూమికనధరించి ప్రశంసనీయంగానటించారు.













Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.